శ్రీ

# అభినవసరస్వతి

యనునొక మాసపత్రిక

అష్టావధాని. జానపాటి పట్టాభిరామ శాస్త్రి

బ్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.

సంపుటము 6 | 1914 ఆగస్టు | సంచిక 8

విషయములు.





చందాప్రియము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 2 0 0

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur
and Published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry

అభినవసరస్వతీ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు—

| | | | | |
|---|---|---|---|---|
| 1 | అళ్ళియాచార్యవిజయము ... ... | రు. 0 | 4 | 0 |
| 2 | కరిణీకోద్ధారిణి ... ... | 0 | 4 | 0 |
| 3 | వాసంతికాపరిణయము } ఇవి నాటకములు. | 0 | 4 | 0 |
| 4 | కంసవధము | 0 | 8 | 0 |
| 5 | చమత్కారమంజరి ... ... | 0 | 4 | 0 |
| 6 | విరూపాక్షపీఠగురుపరంపర .. ... | 0 | 2 | 0 |
| 7 | నీతిగీతలు (సుమతిశతకమునకు సంస్కృతము) | 0 | 2 | 0 |
| 8 | వత్సల నీతిశతకము ... ... | 0 | 1 | 6 |
| 9 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము ... ... | 0 | 2 | 0 |
| 10 | అత్యద్భుతవిమర్శనము ... ... | 0 | 5 | 0 |
| 11 | నర్సరావుపేట శతావధానము (తిరుపతివేంకటీయము) | 0 | 3 | 0 |
| 12 | లక్ష్మీవిలాసము ... ... | 0 | 4 | 0 |
| 13 | చిత్తూరుజిల్లా తీర్పువిమర్శనము ... | 0 | 4 | 0 |
| 14 | పశ్యాంపుశ్యాం .. | 0 | 2 | 0 |
| 15 | సంగదోషము ... | 0 | 3 | 0 |
| 16 | పశ్యశబ్దవిచారము .. ... | 0 | 3 | 0 |
| 17 | పీఠభాగవతము .. .. | 1 | 4 | 0 |
| 18 | పుళిందావివాహము ... .. | 0 | 4 | 0 |
| 19 | గురిగింజ .. .. | 0 | 1 | 0 |
| 20 | గుంటూరుసీమ, తిరుపతివేంకటీయము ... | 1 | 0 | 0 |
| 21 | వేమనర్రాగ్రహారశతావధానము . | 0 | 12 | 0 |
| 22 | పిష్టపేషణము .. ... | 0 | 1 | 0 |
| 23. | వ్యాసనిష్కాసనము .. ... | 0 | 1 | 0 |

అభినవసరస్వతి

సంపుట 6. | జానపాదు ఆనంద సం॥ శ్రావణ మాసము | సంచిక 8.

# గ్రంథస్వీకారము

1 సాత్రాజితీయము. 2 ఉమాపతివిజయములను గ్రంథములు మాకార్యస్థానమలంకరించినవి. వీనిపై మాయభిప్రాయము ముందుఁ దెలుపఁబడును.

## కృతివిమర్శము.

1 దొంగస్వామిచరిత్రము 2 స్త్రీవిద్యాసారసంగ్రహము 3 వేణుగోపాలసీసతారావళి—ఇది గుడివాడగ్రామవాస్తవ్యులును గంగాధరపురాగ్రహారికులును నగు బ్రహ్మభట్ల పట్టాభిరామశర్మగారిచే రచింపఁబడినవి. అందు మొదటిగ్రంథమున నొక మాయదారిశూద్రుఁడు బ్రాహ్మణసన్యాసివేషధారియై గుడివాడబ్రాహ్మణుల భిక్షావందనాది సకలసపర్యలకుం బాత్రుఁడగుచు మఱియు ననేకదుష్కృత్యములమూలమునఁ దత్రత్యులఁ బతితులఁజేసి తుదకు రాజకీయశిక్షకు లోనైనసంగతి పద్యశైలిని జక్కఁగ వివరింపఁబడియున్నది. ఏతత్పాఠకులకు డాంభికులమాయలంబడి వారి గొఱగింపఁగూడదనునీతి పట్టుపడఁగలదు. వెల 0-1-0 మాత్రమే—రెండవది స్త్రీలయొక్క విద్యావశ్యకతంగుఱించి శ్రుతిస్మృత్యుదాహరణపూర్వకంబుగఁ జర్చింపఁబడి సకలజనాంగీకారార్హమై యున్నయది ఈగ్రంథకర్త యభిప్రాయము లోకవ్యవహారము లెఱింగి కుటుంబయాత్ర చక్కగా జరుపుకొనుటకు వలయునంతవిద్యయే యావశ్యకముగాని పట్టపరీక్షలయం దాఱితేఱి మగఁడుయన్నమునఁ బెండ్లముబున్నమనుచుఁ గుర్చీపై నుండిదిగక యెల్లప్పుడు కచేరీచేయుచుండవలెనని కాదు- తావన్మాత్రవిద్య పూర్వాచారపరాయణులైనను నవశ్య మంగీకరించినదే యైయున్నది దీనవెల 0-1-6 మూడవది భగవద్వర్ణనావిశిష్టమై గ్రంథకర్త యవ్యాజసాత్వికభక్తిని వెల్లడించుచున్నది. మొత్తమునకు మూడుగ్రంథములును సులభశైలిలోఁ జక్కనికూర్పుకలిగి చదువరులకు

సంతోషకరములగుననుటకు సందియములేదు తుదిపుస్తకము వెల 0-0-6 లు మాత్రమే వలయువారీమూడింటికిని గ్రంథకర్తపేర వ్రాసినఁ బడయఁగలరు

శ్రీశ్రీ జగద్గురు విరూపాక్షస్వాములవారిసన్నిధిని వసుమతిమకామున నయినాపురము సీతారామశాస్త్రిగారుచేసిన అష్టావధానము

1 నిషిద్ధాక్షరము దేవీవర్ణన పెనగవరపు శేషశాస్త్రిగారు

శ్లో॥ త్రిప్వతిశ్రీయుతాభూయాః పాతు దైత్యగణఘ్నికా
దీనం సా మాం కృతార్చాచైర్య ర్యస్యా శ్రీశివమానినీ॥

2 సమస్య, దివాన్ ఘుడియారము వెంకటాచలశాస్త్రిగారు.

శ్లో॥ లోకా వదంతి సతతం కలహోశనంత మస్యాననం సకలకృత్యవినాశహేతు
నైతావదిత్యపి ముఖే మహతీప్రతిష్ఠాఁద్రష్టాక రేస్యసతతం మహతీప్రతిష్ఠా

3 న్యస్తాక్షరము లేఖినీవర్ణనము దుర్గాశాస్త్రిగారు

శ్లో॥ లేఖనేసర్వవర్ణానాం సాధనీవరవర్ణినీ
రాజతేలేఖినీ దుర్గాశాస్త్రిణ శ్రీకరేకరే

4 సభావర్ణన దివాన్ జూజాల వెంకటేశశాస్త్రిగారు.

శ్లో॥ శ్రుతిగణపరినిష్ఠైర్వైదికైర్మార్త్తికైశ్చ గృహతరవరశాస్త్రాధ్యాయిభిర్వ్రజజాలైః
కరివరమణిబృందై రన్వితా రాజతీయం గురువరతరశోభాఢ్యా శ్రీసభా మాలికేవ॥

5 భాష్యకారవర్ణనము నాందేడు నారాయణశాస్త్రిగారు.

శ్లో॥ లోకాన్ మోహపయోధానిపతితాన్ సంప్రాప్యపారే ముహుః
జాయాపుత్రసుబంధుభృత్యమకరైః రాకృష్యమాణాంస్తదా
దృష్ట్వాత్యంతకృపాప్రపూర్ణహృదయో భాష్యత్రయీంగోవ్యధాత్
నావంనై సుదృఢామిమాం సజయతు శ్రీభాష్యకారోగురుః॥

6 భాస్కరాచార్యసుబ్రహ్మణ్యశాస్త్రిగారు. న్యస్తాక్షరము.

7 మునిషీ హనుమంతరావుగారు, ఘంటానాదము.

8 విద్వాంసులు. చిత్రోక్తులు.

## పుత్రస్మృతి.

చ॥ వెనుకనుముందుచూచినను విష్టపమంతయుశూన్యమయ్యె నే
మనివిలపించువాఁడ నహహా! యిదిమాయయొ యింద్రజాలమో

కనుచెదరో మతిభ్రమయొ, కాదనునో నిటులౌనె యింక నే
యనువున నోర్చువాఁడ, సుతులార! యగోచరమొందఁ బాడియే. 1

ఉ॥ కొందఱు కాలధర్మమునఁ గూడిన దుఃఖమునొంద నెందుకం
చందురుగాని యీతనుజులార! విచార మపారమై సుధా
స్యంది మృదుత్వవైఖరులఁ జక్కని శైలిని గూర్చినట్టి మీ
గ్రంథములం గనుంగొనినఁ గాల్పదె తాపము దేహమంతయున్. 2

శా॥ అయ్యయ్యో! యిదియేమిపాప మిదియేయన్యాయ మో దైవమా!
కుయ్యాలింపఁగదయ్య చిన్నలగు నాకోడండ్ర నేడ్పించి సా
హాయ్యంబియ్యక మూలఁద్రోసితివి, యాహా! పుత్రులంగూల్చి యీ
సయ్యాటంబులొనర్చితౌర తగునే చాల్చాలు హేయీశ్వరా! 3

శా॥ సౌఖ్యంబొందుదునంచు నందఱను నిశ్శంకంబుగా నన్నిటన్
ముఖ్యత్వంబువహింతునంచుఁ గడు మిమ్మున్ నమ్మియుండంగ స
ద్వ్యాఖ్యానంబొనరింప నేమొ దివిలో వాసింపమేలే ఘన
ప్రఖ్యాతిన్ మమువీడి గుంటుపలి సుబ్రహ్మణ్య! పుత్రోత్తమా! 4

సీ॥ "ఏమహాయోగ్యుండు వృజిననిర్దళనప్రశస్తవ్రతాచారచతురుఁడయ్యె
ఏకృతీశుండు సమిద్ధప్రబంధకల్పకవల్లిపత్రికాధికృతియయ్యె
ఏమంత్రి వెంకటకృష్ణసీతారామతనూజాత జనకుఁడై ఘనతగాంచె
ఏదివ్యబుద్ధి లక్ష్మీదేవినామపత్నీప్రాణనాథుఁడై నేర్పుమీఱె
నట్టిసోమాఖ్యుఁడైనబా బంతరించె। నాయనకుఁ గొడుకులున్న వారనుమఁ జెప్పి
"ప్రోవు"మనుచును సూచించిపోతె దివికి। గుంటుపల్లి సుబ్రహ్మణ్య! గుణగణాఢ్య! 5

మ॥ తనయా! నాగతియేమి తెల్పఁగదరా తండ్రీ!"యటంచేడ్వ "నో
యనఘా! శాస్త్రములన్నియుం జదివి తయ్యా! నిన్ను వేఁడేర్చువా
డనె నేనేమియొనర్తు" నంచనుచు నంతం దేహమున్ వీడి శో
భనకైవల్యముఁ గంటె గుంటుపలి సుబ్రహ్మణ్య! పుత్రోత్తమా! 6

శా॥ నీవామామణి పెన్నెఱుల్ గనియు మేనింజూచియున్ నేత్రశో
భావిర్భూతిని గాంచియున్ ముఖశశాంకాభన్ నిరీక్షించియున్

వేవేగఁ విడి యెట్టులేగితివి దానిం జేటుపాల్చేసి యో
ప్రావీణ్యాత్మవిచార! గుంటుపలి సుబ్రహ్మణ్య! పుత్రోత్తమా!

ఇట్లు విలపించునది
ప్రబంధకల్పవల్లరీ పత్రికాధిపతి,
గుంటుపల్లి గోపాలకృష్ణయ్య.

సీ॥ పప్పుసాంబయయింట బహ్వాశోభాకృత్తువై శోభకృత్సమసార్థవైతె
కడుఁబతివ్రతయనంబడు సుబ్బమ్మంజంపి కార్తీకమాసమా! కీర్తిగంటి
పాంథవిప్రులపాలి బలుకామధేనువుం గొని కృష్ణపక్షమా! గొప్పవైతె
భువి నద్వితీయనాఁబొగడొందుసతిని నీపొట్టలోన ద్వితీయ! పెట్టుకొంటె
పిడుగురాళ్లఁ బతివ్రతపేరుమాపి యిలసుశనివారమా! పేరునిలుపుకొంటె
పుణ్యచారిత్ర నందఱుంబూనిచంపి కరముపుణ్యంబుగట్టుకొంటిరె ధరిత్రి.

సీ॥ పిడుగురాళ్లకునెప్డు వడివచ్చుబాపలకిఁకనెవ్వరోగిరం బిడుదురమ్మ
సీతాపతిసతంబు చెయివట్టితోడ్తెచ్చు నెల్లర నెవ రాదరింతురమ్మ
విధివిరామములేక వేవచ్చుచుట్టాలపైనెవరికఁ బ్రేమ పడుదురమ్మ
సాంబయ్యయేటేట సల్పుశుభక్రియ లేసాధ్వియిఁక నిర్వహించునమ్మ
మగల నీపిడుగురాళ్ళకు మంచిపేరు। తెచ్చుసతి యెవ్వ డెవ్వర్తు తేలునమ్మ
కాయజితత్త్వబహుమూల్యకనకవల్లి! శ్రీమతీ! సుబ్బమాఖ్యసతీమతల్లి!

ఈపద్యములు 10వత్సరములకుఁ బైనఁజేయఁబడినవైనను నేతన్మృతస్త్రీకిఁ బుత్రుఁడగు పప్పు సీతాపతిప్రేరణచేఁ బ్రకృతము ప్రచురింపనయ్యె రాధారిగ్రామమగు పిడుగురాళ్లలో నీకుటుంబ మాతిథ్యమిచ్చుటయందుఁ బ్రసిద్ధిగన్నవి.

పత్రికాధిపతి.



శా॥ పటుసాయన్నటనాభిరాముఁడును విస్ఫారార్థ శ్రుత్యంతసం
ఘటితాగారుఁడు సత్స్వభావుఁడు భుజంగస్వామి హారుండు ను
త్కటదేవోత్తమ పూజితుండు గిరిజాకాంతుండు శ్రీశైల వి
స్ఫుటగేహుండగు మల్లికార్జునుని నేఁ బొల్పొంద సేవించెదన్. 50

శ్లో॥ భృంగీచ్ఛానటనోత్కటః కరిమదగ్రాహీస్ఫురన్మాధవా
హ్లాదోనాదయుతో మహాసితవపుః పంచేషుబాణాదృతః
సత్పక్షస్సుమనోవనేషు సపునస్సాక్షాన్మదీయేమనో
రాజీవే భ్రమరాధిపోవిహరతాం శ్రీశైలవాసీ విభుః॥

మ॥ భ్రమరాధీశుఁడు భృంగి తాండవప్రహర్షస్వాంతుఁడున్ నాదిదం
తి మదగ్రాహి మహాసితాంగుఁడు రతీదేవీశ బాణాదృతుం
డు ముహుర్మాధవహర్షభాగి మహితుండై నన శ్రీశైలవా
సి మదీయంబగు మానసాబ్జమునఁ దా భ్రమించి క్రీడించుతన్. 51

శ్లో॥ కారుణ్యామృతవర్షిణం ఘనవిపద్గ్రీష్మచ్ఛిదాకర్మఠం
విద్యాసస్యఫలోదయాయ సుమనస్సంసేవ్య మిచ్ఛాకృతిం
నృత్యద్భక్తమయూర మద్రినిలయం చంచజ్జటామండలం
శంభో! వాంఛతి నీలకంధర! సదా త్వాం మే మనశ్చాతకః॥

శా॥ సారంగీకృతమామకాత్మ కరుణాభద్మప్రవర్షుండు శై
లారూఢుండు విపత్తపోపహుఁడు లాస్యద్భక్తసర్పాళి వి
ద్యారాజ్యాంకుర సత్ఫలార్థవిబుధప్రార్థ్యుండునై సంతత
శ్రీరంజిల్లెడి నీలకంధరు సదా ప్రేమించి వాంఛించెదన్. 52

శ్లో॥ ఆకాశేనశిఖీ సమస్తఫణినాంనేత్రాకలాపీ నతా
నుగ్రాహిప్రణవోపదేశనినదైః కేకీతి యో గీయతే
శ్యామాం శైలసముద్భవాం ఘనరుచిం దృష్ట్వా నటంతం ముదా
వేదాంతోపవనేవిహారరసికం తం నీలకంఠం భజే॥

చ॥ వినతకృపాకర ప్రణవవిస్తృతవేదననిస్వనంబుల
న్గనదురు కేకి యాకసమునన్ శిఖి సర్పపతిం గలాపి యై

ఘనరుచి నద్రిజం గని సుకంబుగ నాడుచుఁదాఁ ద్రయీశిరో
వనిమనునీలకంఠు మదివర్తిల్లఁజేసి సతంబుగొల్చెదన్. 53

శ్లో॥ సంధ్యా ఘర్మదినాత్యయో హరికరాఘాత ప్రభూతానక
ధ్వానో వారిదగర్జితం దివిషదాం దృష్టిచ్ఛటా చంచలా
భక్తానాంపరితోష బాష్పవితతి ర్వృష్టిర్మయూరీ శివా
యస్మి న్నుజ్జ్వలతాండవం విజయతే తంనీలకంఠంభజే॥

మ॥ మఱి సాయాహ్నము వానకాలమును బద్మానాథహ_స్తస్థని
ర్భరఢక్కాధ్వని మేఘగర్జ దివిజాసాంగేక్షణల్ చంచలల్
వరదాసామలబాష్పబిందుకణముల్ వర్షంబు శర్వాణి మే
దురసర్పాశిని గాఁగ నాడువిభుఁ గొల్తున్ నీలకంఠున్ మదిన్. 54

శ్లో॥ ఆద్యాయామితతేజసే శ్రుతిపదై ర్వేద్యాయ సాధ్యాయ తే
విద్యానందమయాత్మనే త్రిజగతస్సంరక్షణోద్యోగినే
ధ్యేయాయాఖిలయోగిభిస్సురగణై ర్గేయాయ మాయావినే
సమ్యక్తాండవసంభ్రమాయ జటినే సేయం నతి శ్శంభవే॥

శా॥ ఆదిబ్రహ్మ మనంతతేజు జటి విద్యానందరూపున్ శివున్
వేదోక్తివ్రజవేద్యు భక్తకరుణావిర్భావు నార్యాధరా
స్వాదానందుఁ ద్రిలోకరక్షకు మునీశధ్యేయు మాయావి స
ర్వాదిత్యాస్వహగేయుఁ దాండవక్రియాత్యాసక్తు సేవించెదన్. 55

శ్లో॥ నిత్యాయా త్రిగుణాత్మనే పురజితే కాత్యాయనీశ్రేయసే
సత్యాయాదికుటుంబినే మునిమనఃప్రత్యక్షచిన్మూర్తయే
మాయాసృష్టజగత్త్రయాయ సకలామ్నాయాంత సంచారిణే
సాయంతాండవసంభ్రమాయ జటినే సేయంనతి శ్శంభవే॥

ఉ॥ నిత్యుఁడు సద్గుణత్రయుఁడు నిర్జితపూర్త్రయుఁ డార్యపర్వతా
పత్యతపఃఫలాత్మకుఁ డశాధ్యుఁడు నాదికుటుంబిమౌని హృ

త్సత్యనిదర్శనుం డుపనిషత్ప్రవిహారుఁడు సృష్టికార్యమం
దత్యనురాగుఁడై వెలయు నద్భుతనాట్యవినోదుఁ గొల్చెదన్. 56

శ్లో॥ నిత్యం స్వోదరపోషణాయ సకలానుద్దిశ్య విత్తాశయా
వ్యర్థం పర్యటనం కరోమి భవతస్సేవాం న జానే విభో!
మజ్జన్మాంతరపుణ్యపాకబలత స్త్వం శర్వ! సర్వాంతరః
తిష్ఠస్యేవ హి తేన వా పశుపతే! తే రక్షణీయోస్మ్యహం॥

చ॥ పదఁపడి కుక్షిరక్షణకపారధనేచ్ఛను సర్వలోకులన్
వదలక సన్నుతింపుచును వ్యర్థముగా జరియించుచుంటి, నీ
పదభజనం బెఱుంగ, పశుపాలక! ప్రాగ్భవలబ్ధపుణ్యసం
పదవలనన్ భవత్కృపకుఁ బాత్రుఁడనైతిని బ్రోవుమీశ్వరా!. 57

శ్లో॥ఏకో వారిజబాంధవః క్షితినభోవ్యాప్తం తమోమండలం
భిత్వా లోచనగోచరోపి భవతి, త్వం కోటిసూర్యప్రభః
వేద్యః కిం న భవస్యహో ఘనతరం కీదృగ్విధం మత్తమః
తత్సర్వం వ్యపనీయ మే పశుపతే! సాక్షాత్ప్రసన్నో భవ॥

శా॥మిత్రుం డొక్కఁడు, నేత్రగోచరుఁడగున్ మిన్నున్ భువిం గప్పుదు
ష్పాత్రం బై తగు చీకటిం గెడపి, యోశంభూ! యసంఖ్యార్కస
న్మిత్రాభుండవ వేద్యుఁడై తివి దియేమీ? మత్తమం బెంత? యా
శత్రుత్వాస్పదమెల్లఁ బాపి యిడుమీ సాక్షాత్ప్రసన్నత్వమున్. 58

శ్లో॥హంసః పద్మవనం సమిచ్ఛతి యథా నీలాంబుదం చాతకః
కోకః కోకనదప్రియం ప్రతిదినం చంద్రం చకోర స్తథా
చేతో వాంఛతి మామకం పశుపతే! చిన్మార్గమృగ్యం విభో!
గౌరీనాథ! భవత్పదాబ్జయుగళం కైవల్యసౌఖ్యప్రదం॥

శా॥చక్రాంగం బరవిందకాననము రాజచ్చాతకం బభ్రమున్
జక్రం బర్యమునిన్ జకోరము విధున్ సౌఖ్యంపడం గోరునే
జక్రత్వంబును లేక యట్లు మఱి నాస్వాంతంబు నెల్లప్డున్
శుక్రారాధ్య! భవదంఘ్రినీరజము లస్తోకంబుగాఁ గోరెడిన్. 5

శ్లో॥ రోధ స్తోయహృత శ్శ్రమేణ పథిక శ్ఛాయాం తరో ర్వృష్టితో
భీత స్స్వస్థగృహం గృహస్థ మతిథి ర్దీనః ప్రభుం ధార్మికం
దీపం సంతమసాకులశ్చ శిఖినం శీతావృత స్త్వం తథా
చేతస్సర్వభయాపహం వ్రజ సుఖం శంభోః పదాంభోరుహం॥

ఉ॥ వారిహృతుండు కూలమును బాంథుఁడు శ్రాంతతఁ జెట్టునీడ వ
ర్షోరుభయుండు మంచియిలు నోజ గృహస్థును విందు ధార్మిక
త్సౌరమణుం దరిద్రుఁడు తుషారవృతుండు కృశానునిం దమ
శ్చారి ప్రదీపముం బలెను స్వాంతమ! చేరు శివాంఘ్రిపద్మముల్. 60

శ్లో॥ అంకోలం నిజబీజసంతతి రయస్కాంతోపలం సూచికా
సాధ్వీ నైజవిభుం లతా క్షితిరుహం సింధు స్సరి ద్వల్లభం
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయం
చేతోవృత్తి రుపేత్య తిష్ఠతి సదా సా భక్తిరిత్యుచ్యతే॥

ఉ॥ ఊడుగు దాసివిత్తనము లొయ్యన సూచిక యంటురాతినిన్
వేడుక సాధ్వి నైజవిభు వృక్షముఁ దీగ సముద్రు సింధువుల్
గూడెడిచాడ్పునన్ సరెగ గోపతివాహు లసత్పదాబ్జముల్
బోడిమిఁ గూడుమానసమె పూరితభక్తియనంగఁ జెల్లెడిన్. 61

శ్లో॥ ఆనందాశ్రుభి రాతనోతి పులకం నైర్మల్యత శ్ఛాదనం
వాచాశంఖముఖే స్థితైశ్చ జఠరాపూర్తిం చరిత్రామృతైః
రుద్రాక్షై ర్భసితేన దేవ! వపుషో రక్షాం భవద్భావనా
పర్యంకే వినివేశ్య భక్తిజననీ భక్తార్భకం రక్షతి॥

శా॥ ఆనందాశ్రులచే గగుర్పొడువగా నచ్ఛత్వసంఛాదనన్
మేనం జేయుచు వాగ్దరాస్యగతమౌ మేల్గాథలన్ స్తన్యపుం
బానంబుం బొనరింపఁజేసి గిరిశా! భస్మంబు రుద్రాక్షలున్
జానొప్పం దనురక్షగానిడి భవత్సద్భావనాశయ్యకుం
బైనం బండఁగఁ బెట్టి భక్తశిశుఁ దద్భక్త్యంబ పాలించెడిన్. 62

డైన నయ్యనంతయ్యదా నఖిలశాస్త్ర
వేదవేదాంతవిజ్ఞాన వేదియయ్యె॥ 29

ఉ॥ ఆసుగుణైకవార్నిధి దయాపరిభూషితచిత్తవృత్తి శ్యా
మాసతియందు ముప్వురఁగుమారులఁగాంచెఁ దదగ్రజుండు ప్ర
జ్ఞాసురమంత్రి సర్వఘనశాస్త్రవిదుండగు లింగనార్యు ని
త్యాసమభాషు శేషుమహితాయతశీలుని నారసింహునిన్॥ 30

వ॥ వారిలోన॥ 31

సీ॥ వేదాంతసార మేధాదక్షిణామూర్తిఁ
మంత్రాధిరాజ సంస్మరణబుద్ధి
లలితవిద్వన్మనో రంజనాదిమకావ్య
కల్పనానల్ప సత్కల్పశాఖి
సకలశాస్త్రపురాణ సాహిత్యసందర్భ
వాచావిలాసాని వార్యవృత్తి
పరమని శ్రేయసాస్పద శంభుసద్భక్తి
మానితాద్వైత విద్యానిధాన

గీ॥ మగుచు జెలువొందు కొప్పరాజ్వాన్వయాబ్ధి
చంద్రుఁడగు లింగనాభిఖ్యసచివమౌళి
యమ్మహాత్మునివర్ణింప నలవియగునె
నలువకైనను వేనోళ్ళచిలువకైన॥ 32

గీ॥ గుండిమడవంశవారాశి కువలయాప్తుఁ
డైన వెంకటకృష్ణప్రధానితనయ
వినుతగుణసీమ సకలసాధ్వీలలామ
లక్ష్మమాంబిక సౌభాగ్య లక్షణాఢ్య॥ 33

శా॥ ఆసాధ్వీమణిఁబెండ్లియై నిఖిలవిద్యాశాలియౌ లింగనా
ఖ్యాసంవిత్కవిగాంచెఁ బుత్రుని నృసింహాభిఖ్యునిం ధీమనీ

షాసంవర్ణిత సత్కవిత్వరచనాసాహిత్యపూర్ణ స్సదా
భ్యాసప్రాప్త శివాంఘ్రిపద్మయుగళీ ధ్యానావధానోన్నతుఁ॥ 34
క॥ శివయోగసుఖితచిత్తుఁడు। శివభక్తజనాంఘ్రియుగళ సేవారతుఁడు
న్శివకరగురుభజనాఢ్యుఁడు। శివమహిమాగమవిచారశీలాన్వితుఁడుఁ॥
గీ॥ అట్టి నరసింహసత్కవి యనఘసూత
సంహితను దెల్గుకృతిగాఁగ సంఘటించి
చెప్పగలఁ"డన్నఁడా నను గొప్పరాజ
నారసింహకవిని బిల్వఁగోరిమదిని॥ 36
మ॥ ననురావించి బహూకరించి విలసన్నానామణిశ్రేణి కాం
చనభూషాకటకాంగుళీయక సువస్త్రాశ్వాది తాంబూలస
ద్వనుతాంచద్ధనధాన్యమాన్యముల సత్ప్రీతి న్సమర్పించి "యీ
ఘనకల్యాణపురాణసంహిత తెనుంగొనట్టుగాఁ జేయుమా" 37
వ॥ అని మఱియు "నిది మదిష్టదైవంబగు దక్షిణామూర్తికంకితం
బుఁజేయువలయు"ననిన మదిష్టంబగు కృతియిదియగుటకును మదిష్ట
దైవంబును దక్షిణామూర్తియేయగుటకును నద్దేవునానతియు నిది
య యగుటకు నానందింపుచు సుకృతియగు నేతత్కృతికల్పనంబు
న కియ్యకొని కృతిముఖంబునఁ దదీయవంశావతారం బభివర్ణించెద
పూర్వోక్తె తద్గుణవిశిష్టంబగు తద్భక్తవంశంబునందు॥ 28
సీ॥ భాసుర శ్రీగిరి ప్రాగ్ద్వారమున నొప్పు
త్రిపురాంతకాభిధానపురినిలిచె
త్రిపురాంతకప్రాంత విపులదేశంబులు
పాలించి రాజ్యసంపదలఁదేలె
త్రిపురాంతకేశ్వర దేవాలయద్వార
సరణి జయాంక శాసనమునిలిపె
త్రిపురాంతకేశ్వర త్రిపురసుందరులకు
విమలభక్తి రథోత్సవములుచేసె

గీ॥ త్రిభువనఖ్యాతకీర్తియై దేజరిల్లె
ననఘ కొలగానివంశ దుగ్ధాంబురాశి
ఘనతరోజ్వలకాంతి రాకావిభుండు
శాంతయుతమానసుఁడు త్రిపురాంతకుండు॥ 39

ఉ॥ ఆత్రిపురాంతకుండు విమలాత్ముని లింగయనామధేయు వి
ద్యాత్రిపురాంతకుంగనె బుధాభినుతుం దనయు న్నయాన్వితు
న్గోత్రపవిత్రుని న్స్వమతగోత్ర సుగోత్రవిదారణక్రియా
గోత్రభిదున్నతు న్స్వజనగోత్రసమి త్పరిపాలనోజ్వలున్॥ 40

ఉ॥ లింగవిలీనచిత్తుఁ డురులింగసమర్చనకాలకారి ప
ల్లింగసమర్పణస్థితి విలీనజగత్ప్రతిభావిశేషుఁడా
లింగమయాంగియు న్విగతలింగ శరీరవికారుఁడై నయా
లింగన సన్నుతింపఁగ బళీ గలరే భువి నెట్టిమానవుల్॥ 41

గీ॥ అతఁడు పామిశెట్టియన్వయ జనితయా
బుచ్చమాంబయందుఁ బొసఁగఁ గాంచెఁ
బాపయాఖ్యునఘు నీపూరినాముని
సుతులనిద్దఱిని మహితనియతుల॥ 42

శా॥ ఆపూరన్వయవృద్ధిఁజేసె మును దానాకాలమందుండి నేఁ
డీపూరన్వయవృద్ధిఁజేసె మును దానీకాలమందంచుఁ ద
న్నీ పూరించు జగంబులెన్నఁదగఁ దానెంతేమహాశైవుఁడై
యీపూరాఖ్యుఁడు షట్థ్సలాధ్వగతుఁడై యీశానసద్భక్తుఁడై ॥43

గీ॥ అతఁడు చుక్కవంశమందుజన్మించిన
బసవమాఖ్యవలనఁ బార్వతికినిఁ
బొసఁగఁబుట్టినట్టి పోలఁతిని జిన్నమ్మఁ
బెండ్లియాడి కాంచెఁ బ్రియతనయుల॥ 44

క॥ పెదకోటప్పను లింగన
నుదయింపఁగఁజేసె, వారలుద్యన్మతులై

మదనారిభక్తమండలి
విదితంబుగ వారుగలసి వెలసిరిధరణిఁ॥ 45

సీ॥ తతనిరంతరదాన ధారామృతాసార
వర్ష సంపూరితవారిరాశి
పగకీర్తిచంద్రికా వ్యాపాండురాకృతి
శ్రీకలోకాలోక లోకవితతి
సర్వసర్వంసహా ఖర్వదుర్వహతమో
హరణప్రతాప బాలార్కమూర్తి
పటుమహోత్తరశైవ ఘటితషట్స్థలమార్గ
సంచారణ క్షమాచారవృత్తి
గీ॥ యంచుఁ జెలువొందె నబ్ధిపర్యంత వార్ధి
మేఖలాస్థిత సుజన సమేధమాన
వర్ణనోదీర్ణ కోలగానివంశజుండు
పెద్దకోటప్ప గుణముల పిండులప్ప॥ 46

గీ॥ చుక్కవంశాబ్ధి సంపూర్ణసోముఁడైన
నాగలింగన్న భ్రమరాంబనాఁ జెలంగు
సతివరించి కోటమ్మయను సుతనుగాంచె
నాసతివరించెఁ బెద్దకోటప్పవేడ్క॥ 47
వ॥ తదనుజుండు॥ 48

సీ॥ ఇష్టంబుప్రాణంబు నేకంబుగావించి
భావలింగమునందుఁ బట్టుకొల్పి
భావలింగధ్యాన పరవశావాప్తిచే
నింద్రియావళికి జితేంద్రియత్వ
మందఁగావిషయౌఘ మాలింగమునకుఁదా
నర్పణంబగుటచే నఖిలజగము

లింగవిహీనమై లేకున్న తానంత
సర్వాంగలింగియై జడతమాని
లింగమైయుంట చేతనభంగగరిమ
లింగనాభిఖ్యగలిగె నిలింగనార్యు
ఘనులు వినుతింపఁగా గొలగానివంశ
లింగనార్యుండు వెలసె ననంగుఁడగుచు॥

గీ॥ అతఁడుచుక్కాన్వయాబ్ధి పద్మాలకాభ
యైనపార్వతమ్మను వివాహమయిసుతులఁ
గాంచె వీరయ్య కోటయ్య కలితనామ
యుతులనిద్దఱ సమ్మోదమతుల హితుల॥

గీ॥ వీరికిని పెదతండ్రియా భూరిగుణుఁడు
ధన్యుఁడౌ పెద్దకోటప్ప దత్తపుత్రుఁ
గాఁగ నీకోటయాభిఖ్యు గారవించి
గరిమనిహపరసౌఖ్యము గాంచెవరుస॥ 51

సీ॥ గుర్వాజ్ఞ నాచార గురుశివచర సుప్ర
సాదమహాలింగ షట్కమొలమి
భక్తిమహేశ్వర ప్రాసాదిసత్ప్రాణ
శరణైక్యముఖ్య షట్స్థలములందుఁ
గాలత్రితయవస్త్ర కలితచిచ్ఛివసూత్ర
గరిమచేబంధించి పరమనియతి
పరసుచిత్తసుబుద్ధి నిరహంకృతిసుమనో
జ్ఞాన సద్భావహస్తములచేతఁ
బూజఁగావించు సద్భక్తిబుష్పరాజి
వీరశైవుండు కొలగాని విమలవంశ
జలధిచంద్రుండు కోటయ్య శైవయోగ
సారసర్వస్వవేదియై చారులీల॥ 52

సీ॥ గురులింగజంగమ స్ఫురదైక్యపదవిన
భంగమై తగు మహాలింగమునకు
షణ్ముఖంబులయందు షట్పదార్థంబుల
నర్పించి సహజలింగైక్యపథము
నందఁగాశిష్యుల కనువులుబోధింపఁ
జేబ్రోలుపురమున సిద్ధమరము
గావించి యందు సుఖస్థితినివసించు
నాశంభుదేవర కనుఁగుశిష్యుఁ
డగుచుఁదదుపదేశంబుచే నఖిలవీర
శైవమర్మంబులెల్లను సంగ్రహించి
దృఙ్మనఃప్రాణముల నొక్కదిక్కుసేర్చి
జంగమార్చన నిత్యంబు సలుపుచుండి॥ 53

క॥ ఘనచుక్కవంశమందున జనియించిన బసవనాఖ్య సరసుఁడు కోట
మ్మనుసాధ్విని దనసతిగాఁ। గొనివీరమయనెగడునట్టి కోమలిఁగాంచెన్॥

సీ॥ వరపతివ్రతగుణస్ఫురణాసమృద్ధిచేఁ
దలపోయగా నరుంధతినిఁబోలు
సతతమహైశ్వర్య సద్భోగసంప్రాప్తిఁ
దలఁచిచూడఁగ శచీతరుణిఁబోలు
మహితక్షమానిత్య మహిమానుకూలత
జర్చించిచూడ భూసతినిబోలు
సౌందర్యకారుణ్య సౌభాగ్యచాతుర్య
గతులచేనెన్నఁగా రతినిబోలు
సీతలోదరియని జనులెన్నుకొనఁగ
సకలసద్గుణ సంతానశాలియగుచుఁ
బుణ్యమతి చుక్కబసవాఖ్య పుత్రియైన
వీరమాంబిక చెలువొందె విమలకీర్తి॥ 55

గీ॥ ఆసతీమణిఁ గులశీలభాసమానఁ
చారుతరమూర్తిఁ బెండ్లియై సకలసౌఖ్య
గరిమసంతానసంపత్తి గాంచిమించి
సప్తసంతానములునందె శాశ్వతముగ॥ 56

గీ॥ అతఁడు తాంబూల జాంబూనదాద్యులైన
షోడశములగు దానములొప్పరిడి జేసి
షోడశకళాభిరాముఁడై సొంపుగాంచు
చంద్రుఁడునుబోలివిలసిల్లె శాశ్వతముగ॥ 57

తే॥ అతఁడు తాంబూలజాంబూనదాదికముల
మించుభూషాంబరాళి యర్పించిచేయు
వింతసత్కారముల కాత్మ సంతసించి
చేయఁబూనితి నీకృతిశ్రేష్ఠమిపుడు॥ 58

తే॥ అఖిలవేదాంత సారమైనట్టిదీనిఁ
దెనుఁగుసేయంగనాబోటి మనుజమాత్రు
కలవిగాదేయంచు మదినెంచి యథపునాజ్ఞఁ
దెలిసినంతవచింతు సందేహమేల॥ 59

వ॥ అనినిశ్చయించితి నదియునుంగాక 60

సీ॥ భావింపమానిపితృదేవతావితతులు
వెలయమజ్జనపాన విహారణముల
కత్యంతసులభమై యమరాపగవసింప
దానితోయముల చేతను జనంబు
లానరించుతర్పణంబునఁ దృప్తిగనురీతి
స్వాధీనమై నూతసంహితార్థ
మంతయుఁగల్గియయ్యార్యులల్పాగమా
మత్కృతార్థమునకు మదిసనంత

సించెదరుగాక యనుబుద్ధిఁజెప్పఁదొడఁగి
నాఁడనీకృతినంబికానాథుకరుణఁ
దగుసహాయంబుగాఁగ నుత్తమమనీషఁ
దగిలిమీరలు వినుఁడయ్యతద్జ్ఞులార! 61

వ॥ మఱియు శ్రుత్యర్థబోధినియగు నీసంహిత ఖండచతుష్టయం బునకు నూటతొమ్మిదధ్యాయంబు లేర్పడియుండు నందు శివమాహాత్మ్య ఖండంబునందుఁ బ్రథమాధ్యాయంబున గ్రంథావతరణంబును ద్వితీయా ధ్యాయంబునఁ బాశుపతవ్రతంబును దృతీయాధ్యాయంబున నందీశ్వర విష్ణుసంవాదంబున నీశ్వరాధిక్యకథనంబును జతుర్థంబునం దీశ్వరపూజా విధాన తత్ఫలంబులును బంచమంబునశక్తిపూజా విధియును షష్ఠమం బున శివభక్తపూజయు సప్తమంబున ముక్తిసాధనంబును నష్టమంబునఁ గాలపరిణామతదనవచ్ఛిన్నస్వరూపకథనంబును నవమంబున హరి వరా హరూపంబున భూమినుద్ధరించుటయు దశమంబున బ్రహ్మసృష్టికథనం బును నేకాదశంబున హిరణ్యగర్భాది విశేషసృష్టియు ద్వాదశంబున జాతినిర్ణయంబును త్రయోదశంబునఁదీర్థమాహాత్మ్యకథనంబునుబలుకం బడియె. నింక ద్వితీయంబగు జ్ఞానయోగ ఖండంబునందలి యిరువది యధ్యాయంబులందుఁ బ్రథమాధ్యాయంబున జ్ఞానయోగ సంప్రదాయ పరంపరయును ద్వితీయంబునం దాత్మచేతఁగలిగిన సృష్టియుఁ దృతీయం బున బ్రహ్మచర్యాశ్రమవిధియును జతుర్థంబున గృహస్థాశ్రమవిధియును బంచమంబున వానప్రస్థాశ్రమవిధియును షష్ఠమంబున సన్న్యాసవిధి యును సప్తమంబునఁ బ్రాయశ్చిత్తంబును నష్టమంబున దానధర్మఫలం బును నవమంబునఁ బాపకర్మఫలంబును దశమంబునఁ బిండోత్పత్తి విధానంబును నేకాదశంబున నాడిచక్రప్రశంసయు ద్వాదశంబున నాడీ శుద్ధియుఁ ద్రయోదశంబునయమంబును జతుర్దశంబున నియమంబును బంచదశంబున నాసనయోగంబును షోడశంబునఁ బ్రాణాయామంబును సప్తదశంబునఁ బ్రత్యాహారంబును నష్టాదశంబున ధారణయోగంబును



# భాగవతరహస్యములు

## ప్రథమాశ్వాసము.

తే॥ చేతులారంగ శివునిఁ బూజింపఁడేని నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలపఁడేని కలుగనేటికిఁ దల్లులకడుపుచేటు
ఆ॥ వేదకల్పవృక్షవిగళితమై శుక ముఖసుధాద్రవమున మొనసియున్న
భాగవతపురాణఫలరసాస్వాదన పదవిగనుఁడు రసికభావవిదులు 2
క॥ భూషణములు వాణికి నఘ, పేషణములు మృత్యుచిత్తభీషణములుహ
త్తోషణములు కల్యాణవి, శేషణములు హరిగుణోపచితభాషణముల్
ఆ॥ అతిరహస్యమైన హరిజన్మకథనంబు మనుజుఁ డెవ్వఁడేని మాపు రేపుఁ
జాలభక్తితోడఁ జదువుఁ దా సంసార దుఃఖరాశిఁ బాసి తొలఁగిపోవు
ఉ॥ ఇంచుక మాయ లేక మదినెప్పుడుఁ బాయనిభక్తితోడ వ
ర్తించుచు నెవ్వఁడేని హరిదివ్యపదాంబుజగంధరాశి సే
వించ నతండెఱుంగు నరవిందభవాదులకైన దుర్లభో
దంచితమైన యా హరి యుదారమహాద్భుతకర్మమార్గముల్ 5
మ॥ హరినామస్తుతిసేయుకావ్యము సువర్ణాంభోజహంసావళీ
సురుచిభ్రాజితమైనమానససరస్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతిలేనికావ్యము విచిత్రార్థాన్వితంబయ్యుఁ బ్రా
కరమైయుండ దయోగ్యదుర్మలినవత్కాకోలగర్తాకృతిన్ 6
చ॥ తనకులధర్మముల్ విడిచి దానవవైరిపదారవిందముల్
పనివడిసేవసేసి పరిపాకమునొందక యెవ్వఁడేని చ
చ్చిన మఱుమేననైన నదిసిద్ధివహించు, తదీయసేవఁ బా
సినఁ గులధర్మగౌరవము సిద్ధివహించునె యెన్ని మేనులన్ 7
క॥ భూపాలకులకు విప్రులఁ, గోపింపం జేయఁదగదు, కోపించినఁ ద
త్కోపానలంబు మొదలికి, భూపాలాటవులఁ గాల్చు భూకంపముగాన్

ఆ॥ ధనముఁగొనుటయొండెఁ దలఁగొఱుగుటయొండె
నాలయంబు వెడల నడచుటొండెఁ
గాని చంపఁదగినకర్మంబు సేసినఁ
జంపఁదగదు విప్రజాతిఁ బతికి 9

ఉ॥ వాయువశంబులై యెగసి వారిధరంబులు మింటఁ గూడుచున్
బాయుచునుండుకై వడిఁ బ్రపంచముసర్వముఁ గాలతంత్రమై
పాయుచుఁ గూడుచుండు నొకభంగిఁజరింపదు, కాలమన్నియున్
జేయుచునుండు, కాలమువిచిత్రము దుస్తర మెట్టివారికిన్ 10

కం॥ మందునకు మందబుద్ధికి,మందాయువునకు నిరర్థమార్గములను గో
విందచరణారవింద మ,రందముగొనఁ దెలిపిలేదు రాత్రిందివముల్

తే॥ భాగవతసంగలవభాగ్యఫలముకీడె
ప్రకృతిగుణహీనుఁడగుచక్రిభద్రగుణము
లీశకమలాసనాదులు నెఱుఁగలేరు
విన్నకిఁవినఁజాలమనియెడి వెఱ్ఱిగలఁడె 12

కం॥ శ్రీపంబులుఖండితసం,తాపంబులు గల్మషాంధతమసమహోద్య
ద్దీపంబులు పాషండదు,రాపంబులు విష్ణువందనాలాపంబుల్ 13

కం॥ పావనములు దురితలతా, లావనములు నిత్యమంగళప్రాభవ సం
జీవనములు లక్ష్మీసం,భావనములు వాసుదేవపదసేవనముల్ 14

కం॥ చెలఁగరు కలఁగరు సాధులు,
మిళితములయి పరులవలన మేలుం గీడున్
నెలకొనినవైన నాత్మకు,
నొలయవుసుఖదుఃఖచయము యుగ్మములగుచున్ 15

ఆ॥ మోక్షకామునకును మోక్షంబుసిద్ధించు
భవభయంబులెల్లఁ బాసిపోవు
యోగిసంఘమునకు నుత్తమవ్రతములు
వాసుదేవనామవర్ణనములు॥ 16

క॥ గోవిందనామకీర్తన,
గావించిభయంబుదక్కి ఖట్వాంగధరి
త్రీవిభుఁడు సూరఁగొనియెను,
గైవల్యముఁ దొల్లి రెండుగడియలలోనన్॥ 17

సీ॥ కమనీయ భూమిభాగములు లేకున్నవే
పడియుండుటకు దూదిపఱుపులేల
సహజంబులగు కరాంజలులు లేకున్నవే
భోజనభాజనపుంజమేల
వల్కలాజినకుశావళులు లేకున్నవే
కట్ట దుకూలసంఘంబులేల
గొనకొనివసియింప గుహలు లేకున్నవే
ప్రాసాదసౌధాదిపటలమేల
ఫలరసాదులుగురియవే పాదపములు
స్వాదుజలములనుండవే సకలనదులుఁ
బొసఁగభిక్షముపెట్టరే పుణ్యసతులు
ధనమదాంధులకొలువేల తాపసులకు॥ 18

క॥ రక్షకులు లేనివారల, రక్షించెదననుచుఁ జక్రి రాజై యుండన్
రక్షింపుమనుచు నొకనరు, నక్షముఁ బ్రార్థింపనేల, యాత్మజ్ఞులకున్॥

క॥ మొత్తుదురుగదల, మంటల, కెత్తుదురడ్డంబు దేహ మింతంతలుగా
నొత్తుదు రసిపత్రికలను, హత్తుదురుకృతాంతభటులు హరివిరహితులన్

సీ॥ వాసుదేవశ్లోకవార్తలాలింపుచుఁ
గాలమే పుణ్యుండు గడపుచుండు
నతనియాయువుదక్క నన్యులయాయువు
నుదయాస్తమయముల నుగ్రకరుఁడు
వంచించికొనిపోవు, వాఁడదియెఱుఁగక
జీవింతుఁ బెక్కేండ్లు సిద్ధమనుచు

సంగనాపుత్ర గేహారామవిత్తాది
సంసారహేతుకసంగసుఖము
దగిలివర్తింపఁ గాలంబుతఱిమెఱింగి
దండధరకింకరులువచ్చి తాడనములు
సేసి కొనిపోవఁ బుణ్యంబుసేయనైతిఁ
బాపరతినైతినని బిట్టు పలవరించు॥ 21

సీ॥ నారాయణునిదివ్య నామాక్షరములపైఁ
గరఁగనిమనములు కఠినశిలలు
మురవైరికథలకు ముదితాశ్రురోమాంచ
మిళితమైయుండని మేనుమొద్దు
చక్రికిమ్రొక్కని జమునియాఁదలనున్న
కనకకిరీటంబు గట్టిమోపు
మాధవార్పితముగా మననిమానవుసిరి
వనదుర్గచంద్రికావైభవంబు
కైటభారిభజన గలిగియుండనివాఁడు
గాలిలోననుండి కదలుశవము
కమలనాభుపదము గననివాసిబ్రతుకు
పసిఁడికాయలోని ప్రాణిబ్రదుకు॥ 22

క॥ మండలములోనభాస్కరుఁ,
డుండి జగంబులకు దీప్తినొసఁగెడిక్రియ బ్ర
హ్మాండములోపలనచ్యుతుఁ,
డుండుచు బహిరంతరముల నొగి వెలిఁగించున్॥ 23

చ॥ హరిఁ బరమాత్ము నచ్యుతు ననంతుని జిత్తములందలంచి సు
స్థిరత విశోకసౌఖ్యములఁజెందినధీనిధు లన్యకృత్యముల్
మఱచియుఁ జేయనొల్లరు,తలంచిన నట్టిదయౌ,సురేంద్రుఁడున్
బరువడినుయ్యిద్రవ్వునె పిపాసితుఁడై సలిలాభిలాషితన్ 24

తే॥ +"జానపాటిని వసియించు సకలవిప్ర
జనులతరఫున దావానుసలుపనయ్యెఁ
గాన నుండిన నాక్షేపకారణములు
చెప్పఁదగు"నంచుఁ బ్రచురమ్ముసేయఁబడియె ॥ 202

ఆ॥ చేయఁబడకమున్నె శ్రీవిరూపాక్షపీ
ఠాధిపతులచెంత కరిగినేను
ఆఱునెలలదాఁక నాసిజాందేశంబు
నంద తిరుగుచుంటి నచ్చటచట ॥ 203

ఉ॥ మున్ను జిలాగెజెట్టునను ముద్రితముం బొనరింపఁ గర్చుకా
నున్నది యెంతయో తెలియకుండుటఁ జేసి యొకండొ రెండొ యూ
నన్నతలంపుతోడ నపు డంతయొనేనిడి వెళ్ళిపోయితిన్
జన్నయనంతరంబునను జాలక పోయెను రెండురొప్యముల్ ॥ 204

+ గుంటూరు డిస్ట్రిక్టు గెజెట్ 1908 సం॥ జనవరినెల 2 తేది గురువారము
నోటీసు. అర్జి నెం. 984/1907.

వాది జానపాటి పట్టాభిరామశాస్త్రిగ్లు. ప్రతివాదులు పోలేటిలక్ష్మయ్య వగైరా.

పల్నాడుతాలూకా జానపాటిలో పోలేరమ్మ, పాతపాటమ్మ అను దేవతల విగ్రహముల ప్రతిష్ఠాదులకు తానువగైరా బ్రాహ్మణులకే హక్కు కలదనియు, ప్రతివాదులకు తాముగాని తమజాతివారితో గాని ప్రతిష్టలుచేయించుటకు హక్కు లేదనియు, తీర్మానించుటకును విసకా పునస్సంప్రోక్షణమూల్యము రు 190 లు యిప్పించుటకును దద్దేవాలయములలో ప్రతివాదులు సంప్రోక్షణాదికమును తాముగాని తమ జాతివారితో గాని చేయించకుండ శాశ్వతమైన యింజెక్షన్ జేయించుటకును + ఉండుట చే నిట్టివారందరితరఫున దా సెక్షను ౩౦ దావాతెచ్చుటకు పర్మిషనిప్పించమని యీవాది చే పిటీషన్ దాఖల్ చేయబడెగాన జానపాటిలోని బ్రహ్మ క్షత్రియ, వైశ్య, శూద్రుల కాక్షేపణములున్నయెడల ది 14-12-07 తేదినాటికి నర్సారావుపేటడిస్ట్రిక్టుమునసబ్ కోర్టులో ఖుద్దునగాని క్రమమైన యధికారముపొందినవారిద్వారాగాని యట్టియాక్షేపణములు తెలియపర్చుకొనవచ్చునని యీతన్మూలముగా తెలియజేయడమైనది

పులిపాక పూర్ణయ్యగారు.
కొండుభొట్ల గోపాలకృష్ణయ్యగారు.
తాడేపల్లి ఆంజనేయశాస్త్రిగారు.

చ॥ A "ఇరువదియొక్క రూప్యముల నిందుకుఁ గచ్ఛవిధించి"రంచు ను
త్తరములువచ్చె, పంపితిని, తద్ద్రవిణంబటఁ జేరి దానిలో
న్సరిగఁ బ్రకాశితంబగు దినంబునకుం గతియించి వాయిదా
మగలఁ బ్రకాశ్యమయ్యెనఁట మామక వార్త జిల్లాగెజెట్టునన్॥ 205
సీ॥ B "క్రమ్మఱ గెజెటునం బ్రచురంబు సేయ ని
ర్వదియొక్క రూపికల్ పనుపు"మనుచు
C "బత్తులు నీపైని బ్రబలమౌ పిర్యాదు
నాచరింపఁగ సిద్ధమైరి"యనుచు

---

జానపాటి వెంకటప్పయ్య ఆశీర్వచనములు. 12-12-07

A... దేశాభిమానిలోను, జిల్లా గెజిటిలోను, ఇంకా ప్రచురము చాయలేదు, అందుకు రు 21 లు అగునట, పంపుమన్నారు. యెవరు పంపలేదు. ఉలంజవిద్దను తండ్రియెవ్వడ న్నట్టు వున్నది ఇదేల్లుండగా క్రిమినల్ చార్జి నీమీద దాఖలుకాబోవుచున్నది. నీవు నాకు పైకము పంపిస్తానని కూడ పంపలేదు మ॥ పూర్ణయ్యపంతులు గారికి కర్చులనిమిత్తం పయికము పంపుతామని పంపలేదు. కర్చులు పెట్టేవారు యిక్కడ యెవరు లేరు. గనుక తక్షణం మ॥ పూర్ణయ్యపంతులు గారి పేర గాని, గోపాలకృష్ణయ్య గారి పేర గాని ఖర్చు దేశాభిమాని జిల్లా గెజిటినిమిత్తం 25 రూపాయలు పంపవలసినది. జరూరు. మేజస్ట్రీటు సమక్ష అక్కడికి వచ్చునట, యింకేగా శేషాలు, గ్రహించవలెను.

B వి. మేళ్ళచెర్వు కామయ్య నమస్కారములు. ....

మీ దావాలో 1-5 ప్రతివాదులకు తిరిగి నోటీసులు వుత్తర్వు చేస్తామన్నారు, దేశాభిమాని, జిల్లా గెజిటీలలో వేయుటకున్నూ, ది 17-3-1908 తేదికి వాయిదా వేసినారు. ఇదివరలో వేయించినది వక వాయిదాకు సొమ్ము పంపవలసినది వాయిదా గతించి నపిమ్మట పంపబడినది అందువల్ల అది పనికిరాలేదు. తిరిగి వేయించమని వుత్తరువు అయినది. సొమ్ము పంపవలెను ... పూర్ణయ్యగారికి పంపిన చెక్కు ముట్టినది.

సహోదరా! ది 19-12-07 మల్లవోలు.

C. యింతేగాక నీమీద నరసరావుపేట హెడ్ అసిస్టెంటు కలెక్టరు వారివద్ద కాశిపతి వగైరాలు చార్జి దాఖలుచేసినట్లు యీరోజు విన్నాను నిన్న పేటలో వెంకటప్పయ్య కనుపించినాడుగాని నాతో చెప్పలేదు. ఆయనకు తెలిసినయడల తప్పీలుసంగతు

\+ "ఎన్ని కార్యములున్న నిప్డు రాకున్న
దావా నిజంబుగం బోవు"నను చు
"ఇంతపర్యంతంబు నితర దేశంబున
నివసించు టది పోటె నీతి"యనుచు
నన్నుంగూర్చియిట్టు లెన్ని యోయుత్తరాల్
బంధుజనులంచేతం బంపంబడంగి
నట్టి కేలకష్టము నిర్గతుండనై
వచ్చితిక్ మగియనసతిం జేర॥ 206

తే॥ వచ్చి క్రమ్మఱ వృసిగ నిర్వాదియొకండు
రాష్యముల్ వెట్టి గెజెటునం బ్రచురపఱుప
శక్తిచాలకయుంటచే జానపాటి
బ్రాహ్మణుల యభిడవేటులం బడయ నెంచి॥ 207

---

లు మీకు వ్రాస్తాడని లలుస్తాను. మీరు ఇంతకాలవిరామంగా వుత్తరం వ్రాసినందుకు చాలా విచారపడుతూయికముందిట్లుచేయకుండుటకు వేడినాను. జానపాటి చెర్వుక్రింద సాగుచేస్తున్నారు రాత్రి జానపాడు వెళ్లినాను మీమామగారివిషయము యియేమియే స్పాటు చెసిలిరో తెలియదు. తు॥ సూర్యనారాయణ.

\+ మీ దావా సంగతులు ఇంతవరకు గెజటీలో అచ్చుకాలేదు. అందునిమిత్తం నోమ్ముదాఖలు చేయుటకు యిదివరకు రెండు వాయిదాలుగతించినవి తిరిగి 28-4-1908 తేది వాయిదా అయివున్నది గనక యీవుత్తరం అందినవెంటనే బయలుదేరివచ్చి పనులు జరిగించుకోవలెను. లేనియాడల యికను వాయిదాయివ్వరు దావాపోతుంది. అపవాద వచ్చును. పయికంసమాబయిలు గేరి రావలెను రానియడల నష్టంకల్గును. మీకుమాత్రె జానపాటిలో నేవున్నవి... మీరువస్తారనే యింత కాలం అక్కడవుంచినాము యీవుత్తరం అందినవెంటనే కార్యములమాట అవున్న వ్యవహారవిషయములో తప్పక రావలెను. రానియడల దావాపోతుంది గనుక తెలియపర్చుచున్నాను చిత్తగించవలెను.

నర్సారావుపేట 7-4-08 కామయ్య వ్రాలు.

క॥ ఒక్కొక్కరి మ్రోలకరిగినఁ,
బెక్కండ్రుడటదస్కతులను బెట్టిరి కానీ
వెక్కసమున నొకఁ యియ్యరు,
చిక్కులకడుఁ బెట్టిరకట చేయకవ్రాల్గఁ ॥ 208

క॥ అన్యులు గార్వారలుమఱి,
మాన్యులునా కైననేమి మతిశూన్యులు త
ద్ధన్యులనామంబులు సా
మాన్యముగా బైటఁబెట్టి మానుటక్రమంబా॥ 209

సీ॥ అభిడవెట్లను వ్రాళ్లనాచరింపక చిక్కు
లొందఁజేసినవారు నేరులు కారు
వ్యవహారమునదింపి "వాఁడె చచ్చుత"మంచు
నూరకుండినవారు నేరులు కారు
సాక్ష్యంబు రానైన సాహసింపఁగలేక
యురిభీతి మనువారు నేరులు కారు
కమసాలపక్షంబుఁ గమ్మపౌరోహిత్య
ముగఁగొనకుండినవారు నేరులుకారు
అందఱునుమామకీనులే, యైననేమి
అక్కరకువచ్చువా రొక్కరైనలేరు
ఎవరికో యొక్కరికిఁదప్ప నిట్టిపట్లు
స్వాభిమానమ్ముసున్న మాయయ్యలంగు॥ 210

ఆ॥ అట్టు లభిడవిట్ల నెట్టులో యోజించి
సివిలు కోర్టులోనఁ జేర్పనచట
"దస్కతులు నిజముగఁ దత్తదాఖ్యాకుల
వంచు నెట్లునమ్మనా"నటంచు॥ 211

క॥ పడవేసియుంచి తుదకీ,
"బెడిదపువ్యాజ్యంబునందుఁ బెక్కులుకాకో

చ॥ ఇదియిట్లుండ మొట్టమొదలే ప్రచురించిన యట్టిపత్రికన్
జదివి సువర్ణఘాతుకులు చాలనమర్షయుపూని యెప్పుడో
వదరెడివారు లేఖలను + వ్రాసెడివారును బాహుబూతులన్
బదపడితిట్టువారునయి పైత్యవిశిష్టతనుండి రెల్లెడన్॥ 214

+ (ఇంగ్లీషునకలు) పొన్నప్పసెట్టివీధి సాహుకారుపేట
మదరాసు— 20 వ జనవరి 1908

.... విశ్వబ్రాహ్మణులని సాధారణముగాఁ బిలువఁబడుచున్న శిల్పశాస్త్రజ్ఞుల స్వాభిమానసూచకములగు తలంపులను భంగపఱచుటకై మీచేఁ బ్రచురింపఁబడినకరపత్రము గుంటూరునివాసులగు బ్రహ్మశ్రీ వడ్లమాటి కోటయ్యాచార్యులు మొదలగువారిచే నాక్షేపింపఁబడియె, దానియందు దయాసింహులనిచెలె మీరును "గర్ధకార" యనుదానినిగుఱించి వ్రాసినది చూచితిని, గర్ధకారశబ్దవిషయమైన యీయాక్షేపణయభిప్రాయ మెంతమాత్రము సరియైనదికాదు. ఏలయనగా బలిదిండ్లకైన కఠినమాహాత్మ్యలశరీరములలో విశ్వబ్రాహ్మణరక్త మెంతమాత్రము మిళితముకాలేదు. "వర్ణానుగర్ధకాగ్నోర్ష్ణాదదీత" అను ప్రఖ్యాతుఁడగు జైమినిమహాముని వ్రాసినశాస్త్రమున బహుశః మీకాదరభావ ముండకపోవచ్చును. ప్రస్తుతపు స్వదేశీయకష్టములలో జాతీయము నిలుపఁజాలినవారనియు నేకగ్రీవముగాఁ బ్రజలచే నమ్మఁబడిన విశ్వబ్రాహ్మణుల యాసంతృప్తి నెలవాలయితిరి? ఈరాజధానిలో నుత్తరమున వేమునచేతను దక్షిణమునఁ గపిలునిచేతను నిష్పక్షపాతముగా విశదీకరింపఁబడినసంగతులు మాచిన స్వర్గగలుగదా?

ద్విజులైనమీరు "గాజాఇంగ్లులోనివసించువారు పరులపైఁగ రాళ్ళు వేయఁగూడ" దనుసామెతను ముఖ్యముగా జ్ఞాపకముంచుకోవలెనుగనుక మీరు జనులముందరఁ బెట్టఁదలఁచినటువంటియు నసంభావ్యమైనటువంటియుఁ గరపత్రములోవలెఁగాక శాంతము నెలకొల్పఁగలరని నమ్ముచున్నాను. నేను జెప్పినసంగతులు నిజమనుటకుఁ బ్రమాణము లనేకములుగలవుకాని ముఖ్యముగా బ్రహ్మాండపురాణము శైవస్మృతి స్కాందపురాణము నాగరఖండములలోని కొన్నిప్రమాణముల నీక్రింద వివరించుచున్నాను.

బ్రహ్మాండపురాణము

బ్రహ్మణోవదనాజ్జాతో బ్రాహ్మణః పరికీర్తితః। బ్రాహ్మణో నిర్మితశ్చైవ బ్రాహ్మణో బ్రహ్మకర్మణః॥ బ్రహ్మవంశే బ్రాహ్మణశ్చ నాన్యథా బ్రాహ్మణోభవేత్॥

ఉ॥ అందుకె చాఁగయిచ్చుటకునై ప్రయత్నించిరి మూఁడుమండలం
బందలివారు కొందఱు, (A) "ప్రయాసమె కాని ఫలంబు లే"దటం
చెందఁ బ్రాఁగడరుల్ నుడువ నేమియు నర్పఁగఁ దోఁపకాత్మలన్
మందమునీపనుండిరి స్వమందిరసీమలఁ దిగ్గిపోయి మున్ ॥ 215

ఉ॥ వీరలకన్న నించుక వివేకము గల్గినవారలౌటచేఁ
దూరపునాఁటివారలనుఁ దోఁచను బ్రతికయొంచు నిల్పి త
ద్వారమునన్ శపించుటకు, దానప్రధానుఁడు దుగ్గిరాలలోఁ
జేరి నిరంజనాఖ్య (B) విరసింపఁగఁ జాఁగెను భూమిదేవులన్ ॥ 216

---

దైవజ్ఞ స్మృతి

ప్రథమం సృష్టికర్మాణి ద్వితీయం శాక్యమేవచ। సదాచారం తృతీయంచ బ్రాహ్మణస్యవిధీః స్మృతిః   స్కాందపురాణము.

ఏకః పంచాననో విశ్వకర్మా ... దాతః। ముఖేభ్యస్తస్యపంచభ్యః కుమారాః పంచజజ్ఞిరే॥ వదనేభ్యోగ్నిసంస్తే ... పంచకుమారకాః । శతంగ వింశతిః పంచ వంశజా విశ్వకర్మణః॥ మనుర్మయ స్తథాత్వష్టా శిల్పి విశ్వజ్ఞ ఏవచ। పంచైతే దేవఋషయో విశ్వకర్మముఖోద్భవాః॥

ఇట్లు

మీ ద్వేషగహితమైన బాబున్నై నిరీక్షించు

యమ్. అప్పకర్మ్యాపాచారి.

ది 8-8-08. జానపాడు

(A). . .కథకాగకులు సిమీద క్రిమినల్ చర్యజర్గించటం లాభంలేక మానుకున్నట్లు సూచించుచున్నది. జానపాటి వెంకటప్పయ్యబ్రాలు

(B) 1907 వసం॥ అగష్టు, సెంప్టెబరు, నవంబరు నెలల ప్రబోధినినుండి

క॥ బనగానిపల్లె నానొక । యూపద్యంబైననగరములరా నదియు స
జ్జనశోభితమై కడుగ । ర్జవదూరీకృతమై యుపాలశాస్త్రి వెలుంగున్ ॥ 3

ఉ॥ ఆపురమందుఁ గాపురము నర్మిలిఁ జేయును తత్త్వబోధనా
జ్ఞాపకసాంద్రతుం దూర్జటి సన్నాధుఁ డహంకరణేతరక్రియుం
డై పటువేదసారపు రహస్యము శిష్యులఁ గూర్చి చెప్పుచున్
దీపితభంగి వీరవరదేశిక నాముమతోడ నెమ్మయిన్ ॥ 6

క॥ ఆ పరమగురుపదాంబుజ । మేపట్టున హృదయసీమ నిమిడిచి శిష్య
త్వాపాదుండయి యొకతఁడు ప్రాపుగ సిద్ధాఖ్యుఁడోకడు భక్తిన్ జెలెన్ ॥ 12
క॥ అతులమతి సతని విశ్వా । సతఁగని పింజారియనక ఛాత్రత నంగీ
కృతమొనరించియు శిష్యుల । తతిలో నెల్లఱులకున్ బ్రధానిన్ జేసెన్ ॥ 13
శా॥ ఆ పింజారితనూభవుం డతులవేదాంతప్రచారాది వి
ద్యాపారుండయి నిర్మలాత్ముఁడయి యుద్యత్తత్వబోధాధురీ
ణాపాదుండయి దేశికాంఘ్రియుగళిన్ స్వాత్మన్ సదా నిల్పి స
ద్వ్యాపారుండయి సర్వదేశములఁ బ్రోద్యద్భక్తిఁ బూజింపగన్ 14
చ॥ తిఱుఁగుచుఁ బెద్దలన్ గని విధేయతతోడ సపర్యజేయుచున్
దురితజనాళిఁద్రోయుచును దుష్పథవృత్తులఁ దూలనాడుచున్
బరిపరిరీతులన్ దనదుభావము మిత్రులతోడఁ జెప్పుచున్
గురుతరభక్తి సద్గురునిగూర్చితలంచుచు నిశ్చలాత్ముఁడై॥ 15
వ॥ పోయిపోయి పుష్పగిరియను నొకయగ్రహారగ్రామంబు జేరుతఱి॥ 33
క॥ వెనువెంటఁదవులుశిష్యుల ఘనతరనిగమార్థసారకల్పులఁ జేయన్
గని యోర్వలేక పల్లియజనులందరువచ్చి చలముసాధింపంగన్ 54
వ॥ సిద్ధప్రముఖాంతేవాసులన్ జూచి 55
శా॥ ఓరీ! మ్లేచ్ఛకుమార! నీవిటుల నోహో! సాహసంబూని ని
స్సారంబొందఁగ వేదశాస్త్రము లనాచారంబు గాఁబాడఁగా
నౌరా! నీగురువైన నియ్యది యసాధ్యంబంచు నూహింపలే
దే? రాణింపదురోరి వానికను సందేహమ్ములే కెమ్మెయిన్॥ 56
సీ॥ బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులటంచుఁ గులచతుష్టయము చేర్కొనఁగఁ దనరు
నందులో నాదిత్రయంబువారికి వేదపఠనాధికారంబు పరగుచుండు
నెఱవారికెప్పుడు వేదపాఠనముచు గూడదంచార్యులు వాడుకొంద్రు
చిత్తవిభ్రమమునఁ జెడిశూద్రుఁడెవ్వఁడు సదువఁగఁబూను నజ్జడునిఁగూర్చి
గీ॥ జిహ్వకనుగోసి వినెనేని చెవులనిండ సీసముఁగఱంగిపోయఁగఁ జెల్లననుచు
స్మృతులువచియింప నవియెల్లఁ గ్రిందుజేసి యకట! వేదముజదువనౌనటర! మీరు॥
చ॥ అనియిటులాడి పుష్పగిరియందువసించెడి విప్రసంఘముల్
గినుకపడంగఁజూచియును గేవలమందులువీరటంచు న
జ్ఞుల జడాంతరంగముల శాస్త్రియొనర్పఁదలంచి సిద్ధుఁడి
ట్లనియె గభీరవాక్యముల నందఱు సందియమందుచుండఁగన్॥ 62

గరములు రెండు రెండువిశిఖంబుల భూస్థలిఁద్రుంచివైచి వి
స్ఫురదురురత్నకుండలవిభూషితశీర్షము భల్లమొక్కటన్
ధరణికిఁద్రెళ్లనేసె మునిదైవసమూహము సన్నుతింపఁగన్. 115

ఉ॥ అగ్రజుపాటుఁజూచి మహితాగ్రహమేర్పడవానితమ్ముఁడ
త్యుగ్రతఁ దేరుదోలి తనదోఃకుశలత్వముఁజూపి బాణముల్
విగ్రహముచ్చిపోవ నృపవీరునినేయ నతండు వే మదో
దగ్రత సంచలింపక ముదంబుననిట్లనిపల్కె నవ్వుచున్. 116

ఉ॥ "ఇంతకుమున్నెక్రోధమున నిందఱుచూడఁగ నీదుపూర్వజుం
డంతకుచెంతకుంజనియె నట్టులెనీవుచనంగనేల యో
రింతటనైననుండొలఁగు మీసునఁ బైఁ జనుదెంచితేని క
ల్పాంతఘనంజయోజ్వల మహాస్త్రములం దలద్రుంతు" నావుఁడున్.

ఉ॥ అంతటఁబోకవాఁడు విలయాంతకుభంగిఁ జెలంగియార్చి దు
ర్దాంతనిశాతబాణసముదాయము పై నడరింప వాని నిం
తింతలుచేసి భీషణతరేషుచయంబులునాటనేసె భూ
కాంతుఁడువానిమేన సురకాంతలుమిన్నునసంతసింపగన్. 118

శా॥ సూతున్ ధాత్రికిఁద్రెళ్లనేసి ధనువుం జూర్ణంబుగాఁజేసి వి
ఖ్యాతిన్ వాహచతుష్టయంబుశిరముల్ ఖండించి కోటీరమున్
కేతుస్యందనముల్ వెసన్ నఱికినం గ్రోధాత్ముఁడై ఖడ్గమున్
జేతంబూనుకరాఁగ వేగ దునిమెన్ శీర్షం బుదగ్రంబుగన్. 119

వ॥ ఇట్లు కళింగనాథానుజుండుపడినఁ దదీయవరూథినిఁ జే
రుగలిగిన యోధులాయోధనంబున నమ్మహీధవు "వధింత,, మని
మధుమధనునిపయింబఱతెంచు పూర్వగీర్వాణులవిధంబున దశదిశాం
తరాళంబులునిండ నార్చిపేర్చి పేఁకం దాకిన నమ్మేటిమగండు గండు

మీఁజెశరాకర్షణసంధానమోక్షంబు లేర్పరింపరాకయుండఁ బ్రచండ మండలీకృతకోదండదండంబు మెఱయ నిశితార్ధచంద్రభల్లకౌక్షేయకాదిసాధనంబులఁ జతుష్షష్టిసహస్రసంఖ్యలక్ నసుంధరకుంబలిఁజేసె నప్పుడు. 120

సీ॥ మృగమదఘనసార మిళితవక్షోజముల్

సెఱిమించునఖముల నిమిరినిమిరి

మహితవీటీరాగ సహితములై యొప్పు

చక్కెరమోవులు నొక్కినొక్కి

దరహాసచంద్రికాంకురకపోలంబులు

పెంపుసొడుత ముద్దుపెట్టిపెట్టి

ఫణిపద్మబద్ధ్వాణపాశబంధంబుల

లలితో రతికేళిఁదేలి తేలి

గీ॥ రమణ రంభాదినిఖిలాప్సరఃకదంబ

కాంతతరదివ్యభర్మహర్మ్యాంతరాళ

కల్పసుమకల్పితానల్పతల్పములను

వీరులుండిరి నేకు లవ్వేళయందు. 121

—శంతనుమీఁదికి సాల్వుఁడు యుద్ధమునకువచ్చుట—

వ॥ ఆసమయంబున. 122

క॥ శకసాల్వమహీపతు లత్యకలంకక్ సంతసముల నలరుచు నిశితాంబకసంహతిశంతనుపైఁ బ్రకటంబుగఁగదిసిచలముబలముక్ గదురక్.

వ॥ ఇట్లనిరి. 124

చ॥ "చలముఁన నొవ్వ దివ్యశరజాలము నేసి వరాభియాతిదో

ర్బలవిభవంబుమాన్పి పటుబంధురశౌర్య మహార్యమైతగక్

వెలసినవార మేము పృథివీపతులందు,తొలంగు పిన్న వు
జ్వలబలదర్పశౌర్యములు చాలవునీకు రణంబుసేయఁగన్. 125

సీ॥ బంధుమిత్రామాత్యసింధురగాంధర్వ
రథతమోభాస్వత్ప్రకరణము రణము
అశ్రాంతరాజమానానంతనిర్నిద్ర
ఘనసుఖదుఃఖకారణము రణము
స్ఫుటతరమానసాంభోజసంభవలస
త్ప్రకటరోషానలేంధనము రణము
చిరకాలసంచితాంచితమహోన్నతపుణ్య
రమణీయమార్గవారణము రణము
ప్రబలకల్మిషవిసరశరణము రణము
ప్రథితబుధలోకకలితగర్హణము రణము
ప్రకటధర్మక్రియాబ్జవారణము రణము
ప్రమదకౌటిల్యదుర్విచారణము రణము. 126

ఉ॥ కావున నెట్టివారికిని గయ్యము నెయ్యము సేయ నేర్చునే
నీవు తొలంగు బాలుఁడవు నిత్యము సత్యము తప్పకుండ నా
త్మావనిపాలనంబు ముదమార నపారనదీనదీనత
స్థావిగఁ జేసికొమ్ము నిను నేరము వెన్నము కాచి ముందరన్". 127

వ॥ అనినవిని శంతనుండు క్రోధహాసభాసురముఖారవిందుండై యిట్లనియె.

ఉ॥ "పిన్నబలంబు పెంపు మఱి పెద్దలశౌర్యము తెంపు నాజిలోఁ
గన్నులఁ జూతు రందఱును, కష్టపుమాటల కేమి, లోకమె
ల్ల నుతిసేయ నాదు కరలాఘవమిప్పుడు గానవచ్చు మీ
కెన్న నిమేషమాత్ర మిటు లేర్పడ నిల్వుఁడి నాదు ముందటన్. 129

తే॥ చండతరమద్ధనుర్ముక్తసారఘోర
నిష్ఠురామోదఘుమఘుమనినదభూత
బాణనిర్ఘాతసంఘాతబహుళభటాత
ములకు బ్రిహ్మాదులైనను నిలువఁగలరె. 130

వ॥ అదియునుంగాక. 131

ఉ॥ ఇంతకుముం గళింగపతి యేర్పడఁ దమ్ముడు తాను కూలుటల్
పంతమెసంగఁజూచియును బాహుబలంబుచలంబులొప్పఁగా
శంతనుపైకివచ్చుటలు జన్మఫలంబటుగానకుండు రం
డంతకుఁగొల్వఁగాఁజనుదు"రంచు శరంబులు నాటనేసినన్. 132

♦ సాళ్వశంతనులయుద్ధము ♦

క॥ శకభూపాలుఁడుగ్రక్రోధో
త్సుకుఁడై వానామములనూట నూతుబదింటన్
బ్రికటాంగంబులునాటఁగ
నకుటిలగతినేసి పేర్చి యాఱనికినుకన్. 133

తే॥ శక్తివైచినదునుమాడె జనవిభుండు
నరికెఁ బదిశక్తులేసిన సురసముండు
శక్తిశతమేయ ఖండించె శంతనుండు
మించి వెయిశక్తులడరింపఁ దుంచెనతఁడు. 134

వ॥ ఇట్లుత్తుంచి. 135

క॥ పదులు పదిపదులు వేలునుబదివేలును నూఱువేలు బంధురశరముల్
గుదిగ్రుచ్చినట్లునాటినఁ జదికిలఁబడిలేచిపాఱె శకవరుడంతన్. 136

మ॥ చటులభ్రూకుటిదుర్నిరీక్ష్యుఁడగుచున్ సాల్వుండువేగంబ వి
స్ఫుటరౌద్రానలతీవ్రకీలల మహాంభోరాసులంగ్రాచు నృ

ద్భటశూలంబు త్రిలోకభీకరముగాఁ బైనేయ ఖండంబులై
యటభూమింబడ నేసె శంతనుఁడు శాతాస్త్రస్ఫురచ్ఛక్తిమై. 137

వ॥ సాల్వుండు 138

క॥ నిటలాంబకనిటలాంబక
చటులాంబక మేర్చియార్చి శాల్వభుజాభుజముక్
దటుకున నాటఁగ నేసిన
జొటజొటరుధిరంబు దొరఁగె సురలు తలంకన్. 139

ఉ॥ కోపముతోడ శంతనుఁడు గొబ్బున హుమ్మని భల్లమొక్కటన్
జాపమునుగ్గుగాఁ దునుమ సాల్వుఁడు వేఱొకచాపమెత్తి పృ
థ్వీపతిమేన బాణములు తీవ్రత నాటఁగ నేసి వేడ్కఁ ద
చ్చాపముచక్కఁగా నఱకెఁ జండభయంకరతీవ్రమూర్తియై. 140

వ॥ మఱియును 141

క॥ చండధనుర్దండముగొని మండలపతి క్రోధఘూర్ణమానానూనో
ద్దండస్వాంతుండై బలాఖండంబునఁ బెలుచ సూతుకంఠము దునిమెన్.

వ॥ ఇట్లు సారథిఁ జంపి మఱియును 143

క॥ బాణంబుల నాల్గిటఁ గంఖాణంబుల తలలు దునిమి కాండాసన మ
ర్ధేణాంకశరమునఁ దనుస్త్రాణకిరీటములు భల్లతతి విదళించెన్. 144

వ॥ అంతటఁ బోక సాల్వుండు కల్పితస్యందనుండై నృపతిపురం
దరుపయిం గవిసి నిశితవిశిఖవిసరంబులు దశదిశలు నిండ నేసి పేర్చి
యార్చిన. 145

క॥ మౌర్వి మొరయించి శాహా। గర్వం బేపార నృపుఁడు గంధవహాస్త్రం
బుర్వ్విం గదలఁగ నేసిన,। బర్వత బాణమున వాఁడు భగ్నముఁ జేసెన్ ॥

క॥ నాగాస్త్రమేసె భూపతి

వేగమె సాల్వుండు గరుడవిశిఖాభిహతిఁ
బాగమఱితునియఁ జేసెను
వేగుగఁ దిమిరాస్త్రమేసె విభుఁ డుత్కలికన్‌॥ 147

శా॥ చండక్రోధమహోగ్రమూర్తియగుచున్‌ సాల్వుండు వేగంబమా
ర్తాండాస్త్రంబడరింపఁ ద్రుంచి సురదైత్యశ్రేణియార్వంగ ను
ద్దండప్రక్రియ శంతనుండడరి గాంధర్వాస్త్రమున్‌ వైవ సా
ల్వుం డింతింతలుచేసె నిర్జరవరాస్త్రోత్సాహసంరంభతన్‌॥ 148

క॥ ఇవ్విధమునఁదనశరములు
క్రొవ్వాడినిరూపుమాపఁ గుతలేశు డులో
నివ్వటిలు క్రోధమెసఁగఁగ
నవ్వుచునిట్లనియె సాల్వనర నాయకుతోన్‌॥ 149

మ॥ “వినురామూఘుఁడ! సాల్వభూరమణ! నీవిన్నార్తి నేఁగంటి నేఁ
డనిలో నిందఱుచూడ నీదుశిర మత్యంతోగ్రబాణత్రయం
బునఖండింపుదు, లేకతక్కినఁ బ్రదీపోర్వీతలాధీశసం
ఘనుఁడంచున్‌ ననుఁబల్కనే”లని మదోద్ధత్యంబువాటిల్లఁగన్‌॥ 150

క॥ అర్ణవసంఘముగలఁగఁగ! స్వర్ణాద్రిచలింప దోడ్డశరమేర్చి మహా
దీర్ణతనెక్కడ వి ల్లా! కర్ణాంతముగాఁగఁదిగిచి కడువడినేసెన్‌॥ 151

క॥ మింటనుమంటలుగ్రమ్మఁగఁ
గంటకమున నేగుదెంచుఘనబాణము క్రే
గంటనుబాఱఁగఁగనుగొని
తుంటలుగాఁ జేసెవాఁడు దోర్బలమలరన్‌॥ 152

ఉ॥ ఒండొకబాణమేర్చినృపుఁ డోయనిమింట సుపర్వులార్వఁగాఁ
జండధనంజయార్చులు దిశాతతులన్‌ వడిఁగ్రమ్మ నుల్లస

ద్దండధరాకృతింగనలి తప్పక నేయనతండు మార్గణా
ఖండపరిస్ఫురలీల గడికండలుచేసె విచిత్రమేర్పడన్ ॥ 153

వ॥ ఇట్లు సాయకద్వయంబు నిరర్థకంబయిన మహీనాయకుండు కలంగక దుర్వారబాహుఖర్వగర్వసంపన్నుండై తొల్లి గంధపుష్పాక్షతాలంకృతంబగుచుఁ బసిండియొరం బెట్టిన యమ్మహాసియశక్తి సమంత్రకంబుగాఁ గైకొని యం దాదిమధ్యాంతంబులఁ గల్పాంతసమయానల్పకేళీవిహారిచటచ్ఛటారవస్ఫురత్స్ఫులింగభూన భోంతరాళకరాళత్రిశూలపాణియగుశూలపాణియుఁ బ్రళయవేళాసముజ్జృంభమాణకీలాపభాస్వరుండగు వైశ్వానరుండును సంవర్తసమయసముద్దండదండధరుండైన దండధరుండు నుండునట్లుగా ధ్యానంబుచేసి 154

క॥ "దానము సద్గురుభక్తియు
జ్ఞానము జపముం దపంబు సత్యంబు హరి
ధ్యానము నాయెడఁగలిగిన
మానుగనీశక్తి సాల్వ మహిపయిఁగూల్చున్" ॥ 155

వ॥ అనిపలికి వైచిన 156

క॥ పిడుగులుటక్కులఁబడియెను। దడఁబడెఁబద్మాప్తు తేరి ధారాలంబుల్
గడగడవడఁకెజగంబులు। పడిచెడెనింద్రాదిదివిజవర్గముమనముల్ ॥

సీ॥ ఘంటికానాహ్రస్ఘణఘణోద్యద్ధ్వాన
పరిపూరితాజాండభాండమగుచు
బంధురోగ్రప్రభాపటలవిద్యోతిత
ప్రస్ఫురద్దశదిశాభాగమగుచు
వర్ణితాంభోజసంభవనిర్జరేంద్రాది
నిఖిలకకుప్పాలనివహమగుచుఁ

జలితలోకాలోకశైలావృతోల్లస
త్సర్వసర్వంసహాచక్రమగుచుఁ
జటులశతకోటికోటిదుస్సహానిశాత
ఘోరతరకీలికీలికాకులితసర్వ
జంతుసంతానమగుచు వే సాల్వుమీఁద
నరుగు దెంచిన నాతండు బిరుదుచెడక॥ 158

—శంతనునిచేత సాల్వుఁడుచచ్చుట—

తే॥ వడి రథమునుండి పలుకయు వాలుఁ బూని
మంటపైనేగు వీరసింహంబుమాడ్కిఁ
బయిఁగవియ రత్నకుండలప్రభ వెలుంగు
తచ్ఛిరముద్రుంచె విమతులుతల్లడిల్ల॥ 159

—శతకవచుఁడు యుద్ధమునకు వచ్చుట—

వ॥ ఇట్లుసాల్వుండు తత్క్షణంబ తీక్ష్ణంబగుశక్తిచేత నిహతుండైనఁ గనుంగొని వానితమ్ముఁ డుత్తుంగాభిరామంబును గామగమనోద్దామంబును శాత్రవచమూభీమంబును నగు తేరునడిపించి 160

క॥ శతకవచుఁ డుగ్రవైఖరి। శతకోటినిశాతవిశిఖసంతతులు మహీ
శతమన్యుమీఁదనేసెను। శతధృతిముఖలేఖగణమునన్నుతిసేయన్॥

వ॥ అవియును శంతనుం డనర్ఘశమార్గణాసారంబున వారించి 162

క॥ మెఱుఁగడరు నంపగమిచే
నురువడిఁ దచ్చాపదండ మురుఖండములై
దొరగంగఁజేసి హయముల
నఱువది బాణములగప్ప నాఱనికినుకన్॥ 163

వ॥ సాల్వానుజుండు వేఱొకవిల్లెత్తి 164





---

ఈనెల సొమ్ముచెల్లించిన చందాదారులు.

1 లంకా నాగయ్యగారు పెదకొదమగుండ్ల.
2 పుచ్చా పట్టాభిరామయ్యగారు, అసిష్టాంటుకరణము, తుమ్మలచెర్వు
3 పూటుకూరు వెంకటేశ్వర్లుగారు, చీరాల.
4 యీకోటయ్యగారు. (ఫీసు క్లర్కు, బెజవాడ.)
5 భాగవతుల గోపాలకృష్ణయ్యగారు, కృష్ణాయీష్టరిన్ సబ్ డివిజనా
6 గొట్టిపాటి చెంచుసుబ్బారాయుడుగారు, వకీలు, నర్సారావుపేట.
7 గుంటుపల్లి అనంతరామయ్యగారు, టీచరు, గుంటూరు.
8 జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, నాగవరం.
9 తెలికేపల్లి రామచంద్రయ్యగారు, శతావధాని, ఏలూరు.
10 రాచకొండ శివన్నసోమయాజులుగారు, చమళ్లమూడి.
11 కొప్పరాజు గురుచంద్రశేఖరరావుగారు, ఫారెస్టుగార్డు, కొండపిను
12 శ్రీగిరిరాజు రాఘవయ్యగారు, గుండ్లపల్లి.
13 ఘడియారం వెంకటశివశాస్త్రిగారు, సంగంజాగర్లమూడి.
14 కొండపల్లి సుందరామయ్యగారు, కరణము, వేమవరం.
15 జానపాటి వెంకటప్పయ్యగారు, డిటో

## ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్షస్వాములవారు.

2 శ్రీ రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహాదరు జమీందారుగారు గంపలగూడెం

## పోషకులు.

1 శ్రీ రాజా నారయప్పారావు సింహాద్ర్యప్పారావు బహాదరు జమీందారులు, నూజవీడు

2 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి

3 రామసింగుగారు నెల్లుట్ల పాపురపు సంస్థానము మానేజరు నెల్లుట్ల

4 రంగావఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు గుంటూరు

5 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు మక్తాదారు చోల్లేరు

6 బీరకాయల రామారావు దేశముఖుగారు రాయగిరి

## సహాయులు.

1 అన్నమురాజు సుబ్బారావుగారు సండూరు.

2 నండూరు నరసింహారావుగారు, కరణం, నండూరు.

3 నైషధము సీతాకాంతముగారు మోరంపూడి.

4 మెదకు శేషారావు దేశముఖుగారు, నల్లబల్లి.

5 పరాంకుశరావు దేశముఖుగారు, యాడారం.

6 కుప్పా శంకరశాస్త్రిగారు, చివలూరు.

7 గంభీరరావు దేశాయిగారు, లింగన్నపేట.

8 నారసింహారెడ్డి దేశాయిగారు, కాసరబాద.

9 కొండపల్లి అనంతరామయ్యగారు, వకీలు, జొనగాం.

10 పిరాట్ల సీతాకాంతముగారు, చింతపల్లి.

11 కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట.

12 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.

13 వెలుగూరి పిచ్చయ్యగారు, కొదమగుండ్ల.

14 తుమురుగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.

15 గొల్లపూడి వేంకటసుబ్బారావుగారు, వాల్కార్టుబ్రదర్సు, ఏజంటు.

16 రెండుకూరి బ్రహ్మానందీక్షితులుగారు గుంటూరు.